THE ANDHRA PATRIKA, MADRAS.

ఉత్తమ శైవమత గ్రంథము
పండితారాధ్య చరిత్ర
వెల రు 5-0-0లు, ప్యాకింగ్ పోస్టేజి రూ. 1-5-0.
ఆంధ్ర గ్రంథమాల
పోస్టు బాక్సు 212, మదరాసు 1.

# ఆంధ్రపత్రిక

Regd. No. M. 1118 సంపుటం 38. సంచిక 157 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO. శనివారం 8-9-1951 వెల 1 అణా, పోస్టు 0-1-2.



# ప్రాయోపవేశం విరమించమని స్వామిసీతారాంకు నెహ్రూ విజ్ఞప్తి

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ప్రధాని నెహ్రూ సుముఖత

### ప్రధానితో పార్లమెంటు ఆంధ్రసభ్యుల చర్చ: దీక్షా విరమణకై స్వామీజీకి విజ్ఞప్తి

ఢిల్లీ, సెప్టెంబరు 6: ఇండియా పార్లమెంటులోని ఆంధ్రసభ్యులు నేడు భారతప్రధాని నెహ్రూవద్దకు రాయబారంవెళ్లి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగూర్చి చర్చించారు. పండిత నెహ్రూతో కలిసికొని చర్చించినపిమ్మట ఆ రాయబారవర్గంలో వెళ్లిన శ్రీ కళా వెంకట్రావు, అనంతశయనంఅయ్యంగారు, తిరుమలరావుగార్లు స్వామి సీతారాంగారికి ఒక తంతి వార్తను పంపించారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ప్రధాని ధోరణి సుముఖంగాఉన్నట్లు తాముగ్రహించామనీ, స్వామి సీతారాంగారు తమ ఉపవాసదీక్షను విరమించవలెననీ తంతి వార్తలో కోరారు.

### కాశేశ్వరరావుగారి ప్రకటన

హైదరాబాదు, సెప్టెంబరు 7: స్వామీ సీతారాంగారి నిరశన వ్రతాన్ని అధికారులు తేలికగా పరిగణించే పక్షంలో ఆంధ్రదేశంలో పరిస్థితి అదుపు తప్పిపోతుంది" అని విశాలాంధ్ర మహాసభ అధ్యక్షులైన ఎ. కాశేశ్వరరావు (ఎం. ఎల్. ఏ.) గారు ఇవాళ ఇక్కడ పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ చెప్పారు.

ఎ. ఐ. సి. సి. సమావేశానికై కాశేశ్వరరావుగారు ఇవాళ ఉదయం ఢిల్లీకి బయలుదేరి వెళ్లారు. అక్కడ తాను న్నూ, మరి కొందరు ఆంధ్ర పార్లమెంటు సభ్యులున్నూ కలిసి, యీ విషయమై ప్రధాని నెహ్రూగారినీ, హోంమంత్రి రాజగోపాలాచారిగారినీ కలుసుకుని మాట్లాడదలచినట్లు కాశేశ్వరరావుగారు చెప్పారు. స్వామి సీతారాంగారి ఉపవాసం ఆంధ్రదేశంలో ఎన్నడూ కనివిని ఎరుగని కదలిక పుట్టించినట్లుకూడా ఆయన అన్నారు.

## కాశ్మీర్‌కు 50 లక్షల ఋణ సహాయం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: అభివృద్ధి పథకాల నిర్వహణనిమిత్తం భారత ప్రభుత్వం జమ్మూ కాశ్మీర్ ప్రభుత్వానికి 50 లక్షల రూపాయలు అప్పుగా ఇవ్వదలచుకున్నది.

శ్రీ వి. ఎం. రత్నస్వామి చేసిన ప్రశ్నకు సమాధానంఇస్తూ, సంస్థానాల మంత్రి శ్రీ గోపాలస్వామి అయ్యంగారు ఈనిర్ణయాన్ని వెల్లడిచేశారు.

1949-50 వరకు భారత ప్రభుత్వం కాశ్మీర్ ప్రభుత్వానికి 482 లక్షల రూపాయల అప్పు ఇచ్చిందని కూడా ఆయన చెప్పారు.

## పర్షియాతోనూనె రాయబారాల విరమణకు బ్రిటన్ నిర్ణయం

లండన్, సెప్టెంబరు 6: నూనెతగాదా పరిష్కార ప్రయత్నంలో పర్షియాతో జరపిన రాయబారాలను తాత్కాలికంగా నిలుపుచేయడంకాక, విరమించుకొనడమే జరిగినట్లు బ్రిటిష్ ప్రభుత్వం నేటిరాత్రి ప్రకటించినది.

ఈ సందర్భంలో బ్రిటిష్ విదేశాంగశాఖ ప్రతినిధి ఒకరు ఇలా ప్రకటించారు: "పర్షియా ప్రధాని డాక్టర్ మహమ్మద్ మొసాదిక్ ఇటీవల సెనేట్‌లో చేసిన ప్రసంగాన్ననుసరించి అట్టి రాయబారాలవల్ల ప్రయోజనమేమీ లేదని ఋజువు ఔతున్నది. ప్రివీసీలు మంత్రి స్టోక్సు ప్రారంభించిన రాయబారాలు విరమింపబడినవనే అని ప్రభుత్వం నిర్ణయించినది. ఇక పర్షియాలో మిగిలియున్న బ్రిటిష్ పనివారిని దేశంనుండి బహిష్కరించడానికి పర్షియాప్రభుత్వం చేస్తున్న ప్రయత్నంకూడా హేగ్ కోర్టు తాత్కాలిక నిర్ణయానికి విరుద్ధమైన చర్య.

### నూనె టాంకులకు అగ్ని ప్రమాదం

ఏవన్‌మట్ (గ్లాసెస్టర్ షైర్), సెప్టెంబరు 6: 1,50,000 టన్నులకు పైగా నూనెఉన్న 16 నూనెటాంకులు నేటిరాత్రి నిప్పు అంటుకుని పూర్తిగా తగులబడి పోయినవి.

### కంపెనీ చట్ట సవరణ బిల్లు

న్యూఢిల్లీ సెప్టెంబరు 7: పార్లమెంటు ఈవేళ ఆర్థిక శాఖామంత్రి ప్రతిపాదించిన కంపెనీ చట్ట సవరణ బిల్లును ఆమోదించింది.

## కాంగ్రెస్ కార్యవర్గ రాజీనామా

### టాండన్ నెహ్రూల మధ్య రాజీ కుదర్చడానికి ప్రముఖుల కృషి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: నేటి కాంగ్రెసు కార్యవర్గ సమావేశానికి హాజరైన సభ్యులు పదహారుమందీకూడా కాంగ్రెసు అధ్యక్షునికి తమ రాజీనామాలను దాఖలుచేసినట్లు నేటి రాత్రి తెలియవచ్చింది. నెహ్రూ, ఆజాద్‌లు ఇదివరకే రాజీనామాలు ఇచ్చివుండడంవల్ల ఇక కార్యవర్గంలో రాజీనామా పెట్టని సభ్యుడంటూలేడు. ఈ అందరి రాజీనామా పత్రాలు ఇప్పుడు కాంగ్రెసు అధ్యక్షుని అధీనంలో, ఆయన తన ఇష్టంవచ్చిన పంథాను అవలంబించేందుకువీలుగా, దాఖలై వున్నాయి.

పరిస్థితులలోవచ్చిన ఈ నూత్న పరిణామాన్ని బట్టి, నెహ్రూ టాండన్లకు రాజీ కుదరవచ్చునని మళ్ళీ తమకు ఏవో కొంతఆశ కలుగుతున్నదని రాజకీయజ్ఞులు అంటున్నారు. ఏమంటే, కార్యవర్గానికి కార్యవర్గం యావత్తూ ఈ విధంగా రాజీనామా ఇవ్వడంతో కార్యవర్గ పునర్నిర్మాణానికి మార్గం సుగమం అయిందని వీరి భావన.

కాంగ్రెసు అధ్యక్షుడు ఈ రాజీనామాలలో దేనిని ఇంతవరకు ఆమోదించలేదు. కార్యవర్గసభ్యులు యావన్మందీ ఏకముక్తంగా రాజీనామా ఇవ్వడం అన్నది అనుకోకుండా జరిగిన ఆకస్మిక సంఘటన ఏమీకాదు. ఇలాంటిది సంభవమనే విషయజ్ఞులు వెండట్నుంచీ భావిస్తూ వచ్చారు. పండిట్ నెహ్రూ రాజీనామాఇచ్చింది మొదలుకొని ఇప్పటివరకూ ఈ సమస్యను పరిష్కరించడానికి అనేకవిధాలైన ఉపాయాలు ప్రతిపాదించబడి చర్చించబడ్డాయి; నెహ్రూతో సంప్రదించి కార్యవర్గాన్ని పునర్నిర్మించడానికి వీలుగా ప్రస్తుత కార్యవర్గసభ్యులు యావన్మందీ, కాంగ్రెసు అధ్యక్షునికి లిఖితంగా తాము రాజీనామాలు దాఖలు చేయాలన్నది ఈ ఉపాయాలలో ముఖ్యమైనది. ఈ మార్గాన్ని గనుక అవలంబిస్తే, టాండన్ రాజీనామా ఇవ్వవలసిన అవసరమూ ఉండదు; తనకు తానై కార్యవర్గాన్ని పునర్నిర్మించనన్న ఆయన మాటను ఆయన నిలుపుకోడానికి వీలవుతుంది.

ప్రస్తుతదశలో అధ్యక్షుడు రాజీనామా ఇవ్వడం అనేది సంభవిస్తే కాంగ్రెసుసంస్థ పరువుప్రతిష్ఠలు పాడైపోతుందని, కార్యవర్గ సభ్యులలో పలువురు అభిప్రాయ పడుతున్నట్లు తెలుస్తున్నది.

అయితే, ఈ కార్యవర్గ సభ్యులు రాజీనామాలిచ్చిన మాత్రంతో ప్రస్తుత విషమస్థితి గడుస్తుందా అన్నది ఇంకా అనుమానాస్పదమేనని కొంత మంది వ్యాఖ్యానిస్తున్నారు. కాంగ్రెసు అధ్యక్షుడు తాను రాజీనామా ఇస్తాడని బహిరంగంగా ప్రకటించి వున్నాడు. కేవలం కార్యవర్గాన్ని పునర్నిర్మించడం కోసం ప్రస్తుత సభ్యులందరూ రాజీనామా ఇవ్వడం అన్నది కూడ ఆయన కంత ఇష్టంగా వున్నట్టు కన్పించదు. ఇప్పుడు కార్యవర్గ సభ్యులంతా రాజీనామా లిచ్చారంటే, అధిష్ఠాన వర్గంలో పండిట్ నెహ్రూ ప్రముఖ పాత్ర వహించాలన్న అభిప్రాయాన్ని మాత్రమే అది వ్యక్త పరుస్తున్నదని ఒక ప్రముఖ కాంగ్రెసు నాయకుడు వ్యాఖ్యానించాడు.

పోతే ఇక్కడ ముఖ్యంగ గమనించవలసినవిషయం ఏమిటంటే, టాండన్ గారు ఇంకా రాజీనామా ఇవ్వలేదు. నెహ్రూ టాండన్లకు రాజీకుదిర్చి అట్టి అఘాతదాన్ని నివారించేందుకు కొంతమంది కాంగ్రెసు నాయకులు ఇంకా నిర్విరామంగా కృషిచేస్తూనే వున్నారు. ఇప్పటి పోకడలను బట్టిచూస్తే టాండన్ నే అధ్యక్షుడుగా వుంచడం, పండిట్ నెహ్రూకు అనుమతమైన విధంగా కార్యవర్గాన్ని పునర్నిర్మించడం అనే ఈ రెండు చివరికి లగింపు కుదరవచ్చునని వారు ఆశిస్తున్నారు. ఇంతవరకు రాజీ కుదరవచ్చుననడానికి యేదో అస్పష్టమైన ఆశాభావానికి మించి నిర్దిష్టమైన కారణాలు ఏమీ కనిపించడంలేదు. గోవిందవల్లభపంత్ డా॥ బి. సి. రాయ్‌గారలు పండిట్ నెహ్రూతో రేపు ప్రొద్దున సంప్రదింపులు జరిపిన మీదట పరిస్థితులు కొంత విశదం కావచ్చు.

రాజీ అంటూ కుదిరితే, ఉభయ

[2 వ పేజీ చూడుడు]

## 'ఆక్రమణ సేనల ఉనికి జపాన్ కోర్కెకు విరుద్ధం'

### శాంతిసంధి షరతులపై శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశంలో ఈజిప్టు ప్రతినిధి విమర్శ

శాన్ ఫ్రాన్సిస్కో, సెప్టెంబరు 6: నేటి సాయంకాలం 5 గంటలకు ప్రారంభమైన రెండవరోజు జపాన్ శాంతి సంధి సమావేశంలో ఆంగ్లో అమెరికనులు తయారు చేసిన శాంతిసంధి ముసాయిదాను ఈజిప్టు విమర్శించినది.

ఈ సమావేశంలో ఏడు దేశాలు శాంతిసంధి ముసాయిదాపట్ల తమ అభిప్రాయాలు ప్రకటించినవి. అనంతరం సమావేశం రాత్రి 10 గంటలవరకు వాయిదా వేయడమైనది.

జపానుకు చెందిన కొన్ని ప్రాంతాలను జపానునుండి చీలదీయడానికి, జపానులో విదేశాల సైన్యాలు నిలిపి వుంచడానికి సంబంధించిన షరతులను విమర్శిస్తూ ఈజిప్టుప్రతినిధి కామిల్ బే అబ్దుల్ రహీమ్ ఇలా చెప్పారు:- "ఈ సంధిరీత్యా జపానులో విదేశాల సైన్యాలు నిలిపి ఉంచడానికి పూనుకొనడం జపాను ప్రజల కోరికలకు విరుద్ధమైన చర్య. శాంతిసంధిపై సంతకాలు జరిగిన తరువాతకూడా జపానులో విదేశాల సైన్యాలను ఉంచవలసిన అవసరం లేదు. జపానునుండి కొన్ని ప్రాంతాలు చీలదీయడంవల్ల ఏయే దేశాలకు ప్రయోజనం చేకూరేది శాంతి సంధిలో వివరించడం జరుగలేదు. సమితి ప్రణాళికరీత్యా తమ భవిష్యం నిర్ణయించుకునే హక్కు ఆ ప్రాంతాలలోని ప్రజలకు ఉన్నది. వారి అభిమతాలు తెలుసుకోవడానికి ఒక అవకాశం కల్పించాలి. ర్యూక్యూ, బోనిన్ ద్వీపాలను అమెరికా ధర్మకర్తృత్వాధికారం క్రిందకాక ఐక్యరాజ్య సమితి ధర్మకర్తృత్వాధికారం క్రింద ఉంచడం సమంజసం. శాంతి సంధిపై సంతకాలు చేయడంతో దూరప్రాచ్యంలో ఒక క్రొత్తశకం ప్రారంభమౌతుందనీ, ఆ ప్రాంతంలో శాంతి భద్రతలు సుస్థిరంగా నెలకొని అక్కడి తమ సమస్యల పరిష్కారానికి దోహద మీయగలవనీ ఈజిప్టు ఆశిస్తున్నది."

శాంతి సంధిపై తాను సంతకం చేయనున్నట్లు ఎల్ సాల్వడార్ ప్రతినిధి ప్రకటించారు. స్థానిక ప్రజల అభిమతాలు తెలుసుకోకుండా జపానునుండి కొన్ని ప్రాంతాలు చీలదీయకూడదని

(2-వ పేజీ చూడుడు)

## నెలలో పశ్చిమగోదావరిజిల్లా మురుగుకాల్వల మరమ్మతు పని

### నీటి సరఫరా సంఘ సమావేశంలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు హామీ

నిడదవోలు, సెప్టెంబరు 6: పశ్చిమ గోదావరిజిల్లా నీటి సరఫరా సంఘ సమావేశంలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు వరదాచారిగారు మాట్లాడుతూ, జిల్లాలో అన్ని మురుగుకాల్వల మరమ్మతు పనులను ప్రభుత్వం మంజూరు చేసినదని, కొంత ప్రత్యేక సిబ్బంది నియామకంగూడా జరుగుతున్నదని ఒక నెల రోజుల్లో అన్ని కాల్వల మరమ్మతు పనులు ప్రారంభమౌతాయని హామీయిచ్చారు.

నీటి సరఫరా సంఘ సమావేశం యీ 1వ తేదీ, కలెక్టర్ గారి అధ్యక్షతన జరిగింది. యీ సమావేశానికి జిల్లాలోని డిప్యూటీ కలెక్టర్లు, అసిస్టెంటు ఇంజనీర్లు, శాసనసభ సభ్యులు అల్లూరి సత్యనారాయణరాజు, నడింపల్లి తిరుపతిరాజు, దంతులూరి నారాయణరాజు గారలు యింకా కొందరు ప్రముఖులు హాజరైనారు.

వచ్చే సంవత్సరం దాళ్వా పంటలను రద్దు చేసినయెడల జిల్లాలోని పంట కాల్వలన్నిటినీ బాగు చేయించాలనే అంశముపైన చర్చ జరిగింది.

అల్లూరి సత్యనారాయణ రాజు గారు మాట్లాడుతూ, జిల్లాలోని అన్ని మురుగు కాల్వలనూ, బాగుచేయాలనీ, అందు నర్సాపురం తాలూకాలోని, పక్కాల కాల్వ, భగ్గేశ్వరం కాలువ, కంతేరు, మొగల్తూరు, కాల్వలనూ, భీమవరం తాలూకాలోని యనమదుర్రు, కొవ్వూరు తాలూకాలోని రాళ్లమడుగు యర్ర కాల్వలను వెంటనే మరమ్మతు చేయడం అవసరమని, వాటివల్ల చాలా పంట నష్టమగుతున్నదని, నష్టాన్ని నిరోధించి అధిక పంటకు కృషి చేయుటకు తద్వారా రైతులకు లాభం కలుగ చేయుటకు కృషి చేయాలని కోరారు.

చర్చ సందర్భంలో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు వరదాచారిగారు పైన పేర్కొన్న సమాధానం యిచ్చారు.

అనుముల్లంక ప్రాజెక్టు విషయాన్ని గూడా వెంటనే చర్య తీసుకోవాలని సభలో కోరారు.

## అందరికీ సమ్మతమైన ప్రతిపాదనలను చేయమని ఆంధ్రనాయకులకు సూచన

### ముఖ్యమంత్రికిప్రధాని రెండవలేఖ: రాష్ట్రకౌన్సిల్‌లో విరామ తీర్మానంపై ప్రభుత్వకృషి వివరణ

మద్రాసు, సెప్టెంబరు 7: "ఆంధ్రరాష్ట్రం నిర్మాణంగావాలని మేమంతా అంగీకరించాము. ఒకసారి అంగీకరించిన తర్వాత ఇది సాధ్యమైనంత త్వరలో జరగాలని నేను ఆత్రంతో ఉన్నాను." అని భారతప్రధాని నెహ్రూ మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామి రాజా గారికి, స్వామీ సీతారాం ప్రాయోపవేశాన్ని విరమింపచేయగోరుతూ ఇవాళ జాబు వ్రాశారని న్యాయశాఖామంత్రి మాధవమీనన్ గారు నేడు మద్రాసు లెజిస్లేటివ్‌కౌన్సిలులో ప్రస్తావింపబడిన విరామతీర్మాన సందర్భాన తెలిపారు.

పసుమర్తి వీరభద్రస్వామి, మోతే నారాయణరావు, మద్ది సుదర్శనం, నాయకంటి శంకరరెడ్డి, ఆత్మకూరి గోవిందాచారిగారలు కౌన్సిలు అధ్యక్షులకు నోటీసు ఇచ్చిన విరామ తీర్మానాన్ని దాని అవసరాన్నిగూర్చి తెలుపవలసిందిగా అధ్యక్షులు కోరారు. తీర్మానం ఈవిధంగా ఉంది:

"ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సందర్భంలో పరిహద్దుల నిర్ణయించడానికి ఒక సరిహద్దు విచారణ సంఘాన్ని, ఇతరవివాదాస్పదవిషయాలనుపరిష్కరించడానికి ఒక నిష్పక్ష ముధ్యవర్తిని తక్షణమే కేంద్ర ప్రభుత్వం నియమించాలని మద్రాసుప్రభుత్వాన్ని స్వామి సీతారాం కోరియున్నారు. ఈ సందర్భంలో స్వామీ సీతారాం ప్రాయోపవేశానికి పూనుకొన్నందున, వారి ప్రాయోపవేశంవల్ల పరిస్థితి అనుచిత మూలధ్వాన్నమవుతున్నందున, అందువల్ల రాష్ట్రాలలోని శాంతి భద్రతలు భగ్నమయ్యే అవకాశం ఉన్నందున, ఈ పరిస్థితిని ప్రభుత్వం గమనించనందున, ఏర్పడిన అత్యవసర పరిస్థితిని దర్శించడానికి ఈ సభ వాయిదా వేయగోరుతున్నాము."

పసుమర్తి వీరభద్రస్వామి గారు: స్వామీ సీతారాం, వారి శిష్యులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సందర్భాన పూనిన ప్రాయోపవేశంవల్ల రాష్ట్రంలో తీవ్రపరిస్థితి ఏర్పడింది. స్వామి వారి పరిస్థితి, వారిశిష్యుల పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నది. ఈ పరిస్థితిని రాష్ట్రప్రభుత్వం గమనించడం ధర్మం.

అధ్యక్షులు: పరిస్థితి ఏవిధంగా తీవ్రంగా ఉన్నదో చెప్పండి.

డా॥ వరదరాజులు నాయుడు: వారు ఉపన్యాసంద్వారాగాని ఎటుల చెప్పగలరు?

శ్రీ వీరభద్రస్వామి: "ఇది ప్రజలకు చాలా ప్రధానమైన వాంఛితము. స్వామివారి పరిస్థితి ఏ క్షణమైనా ప్రమాదంగా పరిణమించవచ్చు. ఆంధ్రదేశమంతటా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ప్రభుత్వం తగుయత్నాలు చెయ్యలేదనీ తీవ్ర ఆగ్రహావేశము రగులుకొనుచున్నది. పరిస్థితి శ్రుతిమించిరాగాన పడకముందే రాష్ట్ర ప్రభుత్వంవారు ఈ అత్యవసర ప్రమాదపరిస్థితిని కేంద్ర ప్రభుత్వానికి ఎరుకపరచి వారు సత్వర చర్యకు పూనుకోవడానికి ప్రేరేపించవలెను.

అధ్యక్షులు: స్వామివారి, వారి శిష్యుల పరిస్థితి ఏవిధంగా ప్రమాదకరంగా ఉన్నదో వివరించండి.

ఈ సమయాన వీరభద్రస్వామిగారికి సహాయంగా మోతే నారాయణరావు గారు లేచి ఈ విధంగా చెప్పారు:

"ఆంధ్రదేశమంతటా రాష్ట్ర నిర్మాణానికి ప్రభుత్వం తగు యత్నాలు చెయ్యలేదని తీవ్రమైన అసంతృప్తి ప్రబలి ఉన్నది. స్వాములవారు ప్రాయోపవేశాన్ని విరమించవలసిందిగా ఆంధ్రదేశమందలి ప్రధాన పురుషులు వారిని దర్శించియో, సందేశములు పంపియో ఉన్నారు. కొందరు మంత్రులు, వ్యక్తిగత హోదాలో, మాడు గూడా నిన్నే ప్రాయోపవేశాన్ని విరమించాలని సందేశాలు పంపుటవల్ల నే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉన్నదీ బోధపడుతోంది. స్వామివారు ప్రాయోపవేశాన్ని విరమించనట్లయితేను, పరిస్థితి విషమించగలదు. స్వామీ సీతారాం శిష్యులొకరు ప్రాయోపవేశంలో అపస్మారంలో ఉన్నందున ఆసుపత్రిలో చేర్చినారు. ఇంకొక శిష్యునిస్థితి ప్రమాదకరంగా ఉన్నది. ఆంధ్రదేశంలో స్వామివారు సుప్రసిద్ధులు. దేశానికెంతో నిర్మాణాత్మకమైన సేవచేసినారు. ఏవిధానైనా సరే వారిని బ్రతిమాలో, బామాలో వారా ప్రాయోపవేశాన్ని విరమించేట్లు చూడటం మనవిధి. ఈ ప్రభుత్వం

(2 వ పేజీ చూడుడు)

## విదేశాలలో సైనిక స్థావరాలు

—(o)—

### 589 కోట్ల డాలర్లు ఖర్చు: అమెరికా నిర్ణయం

వాషింగ్టన్, సెప్టెంబరు 7: దాదాపు 589 కోట్ల డాలర్ల వ్యయంతో విదేశాలలో సైనిక స్థావరాలు నెలకొల్పడానికి తయారుచేయబడిన కార్యక్రమాన్ని అమెరికా సెనేట్ గత రాత్రి ఆమోదించినది.

### అమెరికా పోర్చుగల్ క్రొత్త ఒడంబడిక

అమెరికా, పోర్చుగల్ దేశాలమధ్య ఒక క్రొత్త ఒడంబడికపై ఈ రోజున సంతకాలు జరిగినవి. ఈ ఒడంబడిక రీత్యా అజోర్సు ద్వీపాలలోని సైనిక కేంద్రాలను ఉత్తర అట్లాంటిక్ సంధి రాజ్యాలు ఉపయోగించవచ్చును.

## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద శు॥ సప్తమి 1951 సం॥ సెప్టెంబరు 8 శనివారం శు॥ సప్తమి ప 12-46 అనూ ప 2-29 వర్జ్యం రా 7-45 ల 9-16 వ.

శు॥ అష్టమి సెప్టెంబరు 9 ఆదివారం ఆ॥అష్టమి ప 10-37 జ్యే ప 1-4 వర్జ్యం రా 8-28 ల 10-2 వ.


# ఆంధ్రపత్రిక

ఒరు లేయుని మొదలించిన పదవిం, యున్నియును తన మనంబున కగు దా పొతుంబు నవిసేయునికి పరాయుణము పరమధర్మ పథములు కెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద శు॥ సప్తమి
శనివారం


## స్వామి సీతారాం కర్తవ్యం

స్వామి సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశాన్ని విరమించడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడ్డవి. వారు తక్షణం ప్రాయోపవేశాన్ని విరమించడంవల్ల అత్యంత ప్రమాద స్థితిలోవున్న తుమ్మల బసవయ్య, సంపత్ కుమారాచారి గార్ల ప్రాణాన్ని కాపాడగల్గడమేగాక, రాష్ట్ర సత్వర నిర్మాణానికి తీసుకోవలసి వున్న చర్యలనుగురించి ఆంధ్రనాయకులు స్తిమితంగా, ఏకాగ్రచిత్తులై విచారించడానికి వీలవుతుంది. రాష్ట్ర సంపాదన బాధ్యతను ఆంధ్ర ప్రదేశ కాంగ్రెస్ సంఘం స్వీకరించింది గనుక, శ్రీయుతులు సంజీవరెడ్డి, గోపాలరెడ్డి, చంద్రమౌళిగార్లు తెలిపినట్లు "మీ ప్రాయోపవేశ ఫలితంగా ప్రస్తుతం యావదాంధ్రుల దృష్టి ఆంధ్రరాష్ట్రంమీదికి మరలింది. దేశంలో ఒక నూతన చైతన్యం బయలుదేరింది. ఒక నూతనోత్సాహం రేకెత్తింది. ఇప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణ కృషికి అనువైన వాతావరణం ఏర్పడింది" గనుక స్వామి సీతారాం ప్రభృతులు గత 16 వ తేదీనుంచీ సాగిస్తున్న ప్రాయోపవేశాన్ని విరమించడం సమంజసం.

ఈ నాయకత్రయం కేవలం ఇట్టి ఉదాత్త భావాలను వెల్లడించడంతోనే తృప్తి చెందడం లేదు. తమ పని తీరినట్లు భావించడం లేదు. "మేము ఇప్పుడే ఢిల్లీకి బయల్దేరుతున్నాము. రాష్ట్రం విషయమై భారత ప్రభుత్వంతో మాట్లాడుతాము. ఆంధ్రరాష్ట్రాన్ని సత్వరమే ఏర్పరచవలసిన అవసరాన్నిగూర్చి నొక్కి చెప్పుతాము. ఇందులో మా శక్తి వంచన లేకుండా కృషి చేస్తాము." అనికూడా సంజీవరెడ్డి ప్రభృతులు హామీ ఇచ్చారు. అంతేగాదు. మేము లోగడ కోరినట్లు ఆంధ్రప్రదేశ కాంగ్రెస్ అధ్యక్షుడుగా శ్రీ సంజీవరెడ్డిగారు "నెల్లూరులో సమావేశం కానున్న ఆంధ్రప్రదేశ కాంగ్రెస్ సర్వసభ్య సమావేశం విభజన సంఘ నివేదికను ఆమోదిస్తూ ఆ నివేదిక ప్రాతిపదికగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తక్షణం చర్యలు తీసుకోవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించగలదు" అని అసందిగ్ధంగా ప్రకటించారు. వీటన్నిటికీ తోడు శ్రీ కళా వెంకట్రావు, శ్రీ యం. తిరుమలరావు, శ్రీ యం. అనంతశయనం అయ్యంగార్ ప్రభృతులు ప్రధానమంత్రిని కలుసుకొని తక్షణం రాష్ట్రనిర్మాణానికి చర్యలు తీసుకోవలసిందిగా విన్నవించారు. ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ సుముఖంగా ఉన్నట్లు కూడా వీరు వెల్లడించారు.

ఈ విధంగా, ఇదివరలో మేము కోరినప్రకారం ప్రముఖాంధ్ర నాయకులందరూ రాష్ట్రసంపాదనకు సమష్టి కృషి చేయగలమని స్వామి సీతారాంకు వాగ్దానం చేస్తున్నారు. ఆనాయకులకృషి ఫలించేటట్లు చేయవలసిన బాధ్యత ఇప్పుడు స్వామి సీతారాం ప్రభృతులపైనఉంది శ్రీ సంజీవరెడ్డి ప్రభృతులు తమ లేఖలో కోరినట్లు, శ్రీ తిరుమలరావు ప్రభృతులు తమసందేశంలో విజ్ఞాపించిన ప్రకారం, స్వామి సీతారాం ప్రభృతులు ఈ ప్రాయోపవేశాన్ని విరమించాలి. వారు కోరినట్లు "ప్రస్తుతం ప్రజల్లో బయల్దేరిన నూతన ఉత్సాహాన్ని, నూతన చైతన్యాన్ని సంఘటితపరచి, ఐక్యతను సాధించడానికి" స్వామి సీతారాం ప్రభృతులు వారి శక్తిని వినియోగించాలి. "అప్పుడు ఆంధ్ర రాష్ట్రం మీరూహించిన దానికంటే శత్వరంగా సులభంగా, సునాయాసంగా సిద్ధిస్తుందను" నాయకత్రయ విశ్వాసం సహేతుకమైనదనే మేము భావిస్తున్నాము.

ఇది రాయబారముల ఘట్టమని, ఈ రాయబారాలు ఫలప్రదం కావడానికి ప్రతిబంధకం కాగల ఎట్టిచర్యలు తీసుకోరాదనీ స్వామి సీతారాం 'సత్యాగ్రహం' ప్రారంభించే విషయంలో నాలుగు రోజుల క్రితం ప్రకటించి ఉన్నారు. సత్యాగ్రహం ప్రారంభించకుండుటకు గల కారణాలే నేడు ప్రాయోపవేశాన్ని విరమించడానికీ ఉన్నవని మా అభిప్రాయం. స్వామి సీతారాం కూడా నాయకులింత శ్రద్ధాసక్తులను ప్రదర్శించిన తరువాత అట్టి అభిప్రాయానికే రాగలరని మా నమ్మకం.

విభజనసంఘం నివేదికాంశములపై ఏకాభిప్రాయం లేదనే సాకుతోనే 1950 జనవరిలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కేంద్రప్రభుత్వం వాయిదా వేసింది. ఇప్పుడట్టి భిన్నాభిప్రాయాలు లేవని ఆంధ్ర ప్రదేశ కాంగ్రెస్ సంఘమూ, ఆంధ్ర నాయకులు ప్రకటించిన తరువాత కూడా కేంద్ర ప్రభుత్వం, ప్రధానమంత్రి ఇంతవరకూ చేస్తూవచ్చిన వాగ్దానాలను పాలించి రాష్ట్ర నిర్మాణానికి ఉపక్రమించకపోతే సంజీవరెడ్డి, గోపాలరెడ్డి, చంద్రమౌళిగార్లు సూచించినట్లు ఆంధ్ర ప్రముఖులందరూ చేరి ఒక కార్యక్రమాన్ని నిర్ణయించి సమష్టిగా, సమైక్య కృషి సల్పి కేంద్రప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావచ్చు. అసలు అట్టి వొత్తిడి తేనవసరం లేదనీ, ఆంధ్రనాయకులు ఎట్టి మినహాయింపులూ, షరతులూ, లేక నాయకత్రయ నివేదికను, ఆనివేదికాధారంగా తయారైన విభజన సంఘనివేదికను అంగీకరిస్తే భారతప్రభుత్వం తక్షణం చర్య తీసుకోగలదనీ పండిట్ నెహ్రూ తిరిగి స్పష్టం చేశారు.

పరిస్థితులువిషమించకుండా, చేయవలసినబాధ్యత, అందరూ రాష్ట్రనిర్మాణ విధానము, కార్యక్రమములపై దృష్టి నికేంద్రీకరించుటకు తగిన పరిస్థితులను, నాతావరణాన్ని కల్పించవలసిన బాధ్యత, ప్రధానమంత్రి చేసిన సూచనల మేరకు ఆంధ్రనాయకులు ఏకాభిప్రాయమునకు వచ్చునట్లు చేయవలసిన బాధ్యత ఇప్పుడు పూర్తిగా స్వామి సీతారాంపైనేఉంది. వారు ఆబాధ్యతను శీఘ్రంగా, అందరికీ గౌరవప్రదంగా ఉండులాగున నిర్వర్తించగలరనే ఆశిస్తున్నాము.

లేకుంటే 1949-50 సంవత్సరంలో విభజనసంఘ నివేదిక విషయంలో పేచీపడి రానున్న రాష్ట్రాన్ని తిరస్కరించి ఈ స్థితికి వచ్చినట్లే, తిరిగి రాష్ట్రాన్ని పొందడానికి నేడేర్పడిన సదవకాశాన్ని చేతులారా వదులుకొని, మున్ముందు ఇంతకంటె అధ్వాన్నమైన పరిస్థితులను ఎదుర్కొ వలసివస్తుంది. 1949-50 నిర్ణయం ఎంత ప్రమాదభరితమైందో, ఎంత అవివేకపూరితమైందో ఈ రెండేళ్ల సంఘటనలు అనుభవానికి తెచ్చినవి. ఇది పునరావృత్తం కారాదనే మా కోరిక. దాన్ని నివారించవలసింది స్వామిసీతారాం ప్రభృతులే. ఇంతవరకూ వారు చేసినదానికి మాత్రం నాయకత్రయం వెల్లడించినట్లు యావదాంధ్రులూ కృతజ్ఞులే.

## జోర్డాన్ రాజు హత్య కేసులో ముద్దాయిలు

### జోర్డాన్ ప్రభుత్వ అభ్యర్థనకు ఈజిప్టు నిరాకరణ

కైరో, సెప్టెంబరు 6: కర్నల్ అబ్దుల్లా టెల్, మూసా అయూబీలను తమకు అప్పగించమని జోర్డాన్ ప్రభుత్వము చేసిన అభ్యర్థనను ఈజిప్టు నిరాకరించినట్లు విదేశాంగశాఖ ప్రతినిధి ఒకరు నేడు ప్రకటించారు. జోర్డాన్ రాజు అబ్దుల్లా హత్యతో సంబంధమున్న నేరంపై ఒక సైనిక న్యాయస్థానం ఆ ఇరువురికి మరణశిక్ష విధించినది.

ప్రముఖ వాన్టెడ్లు నాయకుడు అమీన్ ఉస్మాన్ పాషా హత్యతో సంబంధమున్న హుస్సేన్ టౌఫీక్ రెండు సంవత్సరాల క్రితం జోర్డాన్ పారిపోయాడు. అతనిని ఈజిప్టుకు అప్పగించడానికి జోర్డాన్ ప్రభుత్వం నిరాకరించినది. అందువల్ల పై ఇరువురిని జోర్డాన్‌కు అప్పగించడానికి వీలు లేదని ఈజిప్టు న్యాయశాఖ సూచించినది.

### జోర్డాన్ నూతనఅధినేత తలాల్

అమ్మాన్, సెప్టెంబరు 6: నిన్న జోర్డాన్ రాజుగా ప్రకటించబడిన తలాల్ స్విట్జర్లాండునుండి విమానంలో నేడిక్కడికి చేరుకున్నారు. జూలై 20 వ తేదిని హత్యచేయబడిన అబ్దుల్లా రాజు కుమారుడు తలాల్‌కు జోర్డాన్ ప్రజలు ఘనమైన స్వాగతమిచ్చారు. ఆయన వెంటనే పార్లమెంటు భవనానికి కారులో వెళ్లి, రాజుగా ప్రమాణం స్వీకరించారు.

## ఆంగ్లో-ఈజిప్షియన్ సంధి సవరణ

### బ్రిటన్ ఇప్పట్లో క్రొత్త ప్రతిపాదనలు చేయదట

లండన్, సెప్టెంబరు 7: సెప్టెంబరు నెల మధ్యలో వాషింగ్టన్‌లో జరుగనున్న త్రైపాక్షిక సంభాషణలకు ముందుగాఆంగ్లో-ఈజిప్షియన్ సంధిసవరణకు బ్రిటన్ క్రొత్త ప్రతిపాదన లేమీ చేయబోదని బ్రిటిష్ విదేశాంగమంత్రి మారిసన్ యీ రోజున లండన్‌లోని ఈజిప్షియన్ రాయబారికి తెలియపరచినట్లు ఇక్కడి అభిజ్ఞ వర్గాలవారు చెబుతున్నారు. ఈజిప్షియన్ రాయబారి అమీర్ పాషా బ్రిటిష్ విదేశాంగ కార్యాలయంలో మారిసన్‌ను కలుసుకున్నారు. వచ్చేవారం మూడు పశ్చిమ అగ్రరాజ్యాల విదేశాంగ మంత్రులు వాషింగ్టన్‌లో సంభాషణలు జరుపనున్నారు.

1936 నాటి ఆంగ్లో - ఈజిప్షియన్ సంధి సవరణకు క్రొత్త ప్రతిపాదనలు చేయుమని సూచిస్తూ, ఈజిప్టు ప్రధానమంత్రి నహాస్‌పాషా ఆగస్టు నెలఆఖరున మారిసన్‌కు ఒక లేఖ పంపారు.

### మాస్కోలో అమెరికన్ రాయబారి సంప్రతింపులు

మాస్కో, సెప్టెంబరు 6: మాస్కోలోని అమెరికన్ రాయబారి అలన్ కర్క్ ఈ రోజున సోవియట్ విదేశాంగమంత్రి ఆండ్రీ విషిన్స్కీతో సంప్రతించారు. వివరాలేమీ ప్రకటింపబడలేదు. అమెరికన్ రాయబారి అభ్యర్థనపై నేటి సమావేశం ఏర్పాటు చేయబడినట్లు రాయబార కార్యాలయం ప్రకటించినది.

### ఎ. ఐ. సి. సి.

న్యూఢిల్లీ సెప్టెంబరు 7: అఖిల భారత కాంగ్రెస్ సంఘ సమావేశం ఇక్కడ కాన్‌స్టిట్యూషన్ క్లబ్‌లో రేపు సాయంత్రం 6 గం॥కు ప్రారంభమవుతుందని ఎ. ఐ. సి.సి. కార్యాలయం నేడు ప్రకటించింది,

## లాహోరులో విమాన దాడి రక్షణ శిక్షణ

### నిజమైన బాంబులనే ప్రయోగిస్తారట

లాహోరు, సెప్టెంబరు 4: పెద్ద యెత్తు విమానదాడి రక్షణ ప్రదర్శనకు నిర్ణయించుకొన్న ఈ నెల 20 వ తేదీ నాటి రాత్రి లాహోరులో, ఇందుకు గాను ప్రత్యేకంగా నిర్మించిన ఉత్తుత్త గృహాలపై అసలైన బాంబులువేసి, బాంబులదెబ్బ ఎట్లుంటుందో ప్రజలకు ప్రత్యక్షంగా చూపెట్టబోతున్నారు.

ఆ నాటిరాత్రి నగరమంతా దీపాలు పూర్తిగా ఆపివేసి, చిమ్మచీకటి చేయబోతున్నారు. 24 గంటలపాటు ఊరంతా నీటి సప్లయి ఆపివేస్తారు.

నిజమైన యుద్ధరంగం ఎట్లా ఉంటుందో ప్రజలకు కండ్లకు కట్టినట్లు చూపించవలెనని పౌరరక్షణాధికారులు అసమానమయిన ప్రదర్శన ఏర్పాట్లు చేస్తున్నారు.

సైరన్లమోత చెవులబడంగానే ఎ. ఆర్. పి. వాలంటీర్లు, పోలీసులూ తప్ప మిగిలిన యావన్మందీ ఎవరి యిండ్లలో వారు కిమ్మనకుండా దూరుకోవాలి. రోడ్లలో జనం రాకపోకలు పూర్తిగా బంధైపోతాయి. ఆ వెంటనే విమానాలు రివ్వున వచ్చి దాడి ప్రారంభిస్తాయి.

### భారత పౌరునిపై పాకిస్థాన్ అత్యాచారాలు

అమృతసరము, సెప్టెంబరు 6: స్వంత పనిమీద లాహోరుమీదుగా కాబూలు వెళ్లుతూవుండిన ఒక ప్రముఖ భారత పౌరుడు గోపాల్ దాసును పాకిస్థాన్ ప్రభుత్వంవారు నానాహింసలు పెట్టారు. లాహోరునుండి అమృతసరమునకు వస్తూవున్న వార్తలమూలమున ఈ సంఘటనకు సంబంధించిన నిజవిషయములు తెలియవచ్చినవి. ఈ విషయము లేవనగా: మిలిటరీ గూఢచారశాఖ డైరెక్టరు బ్రిగేడియర్ చాంగ్ ఎన్. దాస్ తండ్రి ఎల్. గోపాల్ దాసు ఆఫ్‌గన్ స్వాతంత్ర్య దినోత్సవములలో పాల్గొనుటకుగాను కాబూలు వెళ్లుతూ వుండెను. పాకిస్థాన్ భూభాగంగుండా ప్రయాణం చేయడానికి అతనికి పర్మిట్ యిచ్చినప్పుడు అతడు వేసులవాడుగా వెళ్లుతున్నాడని చెప్పి భారతదేశంపై దుష్ప్రచారం చేయడానికి పాకిస్థానీలకు మంచి అవకాశం చిక్కింది. ఇందుకు గోపాల్‌దాసును బాగా ఉపయోగించుకోవచ్చునని వారు తలచారు. కేవలము ప్రచారం నిమిత్తమే అతనిని నానాహింసలు పెట్టడానికి పాకిస్థానీ అధికారులు ఒక పథకం సిద్ధంచేశారు. పాకిస్థానునందలి భారత రాయబారవర్గమువారి చిహ్నము స్పష్టంగా ప్రదర్శించిన భారత హైకమిషనరు కారులో వెళ్లుతూవున్నప్పుడు పాకిస్థానీ పోలీసులు గోపాల్ దాసును అరెస్టుచేసి వెంటనే చేరింగ్ క్రాస్ పోలీసుస్టేషనుకు తీసికొనివెళ్ళి, ప్రశ్నలువేసి నిర్బంధంలో వుంచారు. లాహోరు నందలి భారత హైకమిషనరు కార్యాలయం వారు ఆదుర్దాగా గోపాల్‌దాసు విషయమై ప్రశ్నించగా చాలాకాలంవరకు పాకిస్థాన్ అధికారులు సమాధాన మివ్వలేదు. గోపాల్‌దాసు ఆత్మహత్య చేసికొన ప్రయత్నించాడని ఆగస్టు 30 తేదీన పంజాబు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి లాహోరు నందలి డిప్యూటీ హైకమిషనరుకు తెలియజేశారు. చెరసాలలో గోపాలుదాసుకు కలిగించిన తీవ్రగాయాలను కప్పిపుచ్చడానికి వారు ఈవిధంగా బొంకారని భావించబడుతున్నది. ఈకథ కట్టడానికివారికి రెండుగోజులు పట్టింది. చెరసాలలో అతనితోడ, ఒక చెయ్యి విరగగొట్టారు. ముఖంమీద గాయాలున్నవి. ఒక కంటికి దెబ్బతగిలింది. అతని శరీరానికి మనస్సుకుగూడ వ్యథ కలిగించారు. గోపాల్ దాసు స్థితి ఉపద్రవకరంగా వుండడంవల్ల భారత డిప్యూటీ హైకమిషనరు అతినిని మాడగోరాడు. ఆయనను నిర్బంధించిన కోటనుండి చేరింగ్ క్రాస్ పోలీసు స్టేషనుకు తీసికొనివచ్చి అతని కూర్చుండబెట్టి దూరం నుండి అతనిని ముఖం చూపారు. అతనితో యెవ్వరినీ మాట్లాడనివ్వలేదు. భారత ప్రభుత్వంవారు లాహోరు నందలి తమ డిప్యూటీ హైకమిషనరు ద్వారా మరి యొకసారి ప్రశ్నించగా పాకిస్థాన్ అధికారులు ఆత్మహత్య కథనుమార్చి గోపాల్ దాసు చెరసాల గోడమీదుగా దూకి తప్పించుకొనిపోవ ప్రయత్నించాడని, అందువల్ల అతనికి తీవ్రమైన గాయాలు తగిలవని తెలిపారు. గోపాల్ దాసు నెమోనియాతో బాధ పడుతున్నాడనే కథను పాకిస్థానీ అధికారులు కల్పించినట్లు గూడ వార్త వచ్చింది.

### తూర్పు పాకిస్థాన్‌లో భారత పౌరుని అరెస్టు

కలకత్తా, సెప్టెంబరు 6: పశ్చిమ బెంగాలు నందలి జమీందారీ కచ్చేరీ మేనేజరు సీతాకాంతనంది తూ. పాకిస్థాను నందలి వారిపూరు జమీందారు కచ్చేరీకి లెక్కలు చూపడానికి వెళ్ళగా పాకిస్థానీ పోలీసులు అతనిని అరెస్టుచేసి పోలీసు కాపలాతో ఫకూర్ గోజ్‌కు పంపారని యిచ్చటికి వార్తవచ్చింది. ఈ సందర్భమున దూడినపూరుజిల్లా మేజస్ట్రేటు సుచూడడానికి ప. బెంగాల కాసన సభ్యులైన హమీదుల్ రహమాన్‌నంది గారి మేనల్లునితో తూర్పు దినపూరుకు బయలుదేరి వెళ్లారు.

### కరాచీలో హైందవుని అరెస్టు

కరాచీ, సెప్టెంబరు 6: కరాచీ బోటుక్లబ్బు మేనేజరు దయాల్ మల్గర్ ముఖదాసును గత మంగళవారంనాడు కరాచీ పోలీసులు అరెస్టు చేశారు. అతని అరెస్టుకు కారణము లేవో పాకిస్థాను అధికారులు తెలుపలేదు.

## స్వామి సీతారాంకు నెహ్రూ విజ్ఞప్తి

(1 వ పేజీ తరువాయి)

వారు కేంద్రప్రభుత్వం రాష్ట్రనిర్మాణానికి ఒక సరిహద్దు సంఘాన్ని వెయ్యవలెననీ, మధ్యవర్తి వివాదాస్పద విషయాల పరిష్కారానికి వెయ్యవలెనని చెప్పి యీ పత్రతో తీర్మానం తెచ్చి ఏదోవిధంగా చర్య తీసుకొనడం ఎంతో అవసరం.

అధ్యక్షులు:- స్వామివారి శిష్యులు ఒకరు స్మృతి తప్పి ఉన్నారనీ, మరొక శిష్యుని స్థితి ప్రమాదంగా ఉన్నదనీ నాకు ఉదయం ట్రంకుఫోనులో తెలియజేసినారు. ఈ సందర్భంలో అత్యవసర చర్య అవసరమని నేనూ అభిప్రాయపడుతున్నాను. ఈ సందర్భంలో ప్రభుత్వంవారు ఏమిచేశారో, ఏమి చెయ్యనున్నారో వినగోరుతున్నాను.

మంత్రిమాధవమీనన్:- స్వామివారి ప్రాయోపవేశ విషయంలో మా ప్రభుత్వం కన్న ఆందోళన పడుతున్న వారెవరూ ఉండరు.

స్వామి సీతారాం శిష్యసమేతంగా 21 రోజులుగా ప్రాయోపవేశం చేస్తున్నారు. స్వామివారి స్థితి ప్రస్తుతానికి మామూలుగానే ఉన్నా, 21 రోజులు ఉపవాసం చేసిన తర్వాత పరిస్థితి ఏ క్షణమైనామారవచ్చు. కేంద్రప్రభుత్వంవారిని సరిహద్దు సంఘాన్ని వెయ్యవలసిందిగాను, మధ్యవర్తిని నియమించవలసిందిగాను కోరుతూ మద్రాసు ప్రభుత్వం ప్రాయవలెనని స్వామీజీ కోరలేదా, వారు ఇచ్చిన విజ్ఞప్తిని భారత ప్రధానికి పంపినాము. అందువల్ల ఈ ప్రభుత్వము తన విధ్యుక్త ధర్మమున విఫలమైన సందర్భమేమీ లేదు. గనుక ఈ విరామ తీర్మానం ఇచ్చట ప్రతిపాదించవలసినంత అవసరము ఇప్పుడు లేదు.

అధ్యక్షులు:- వారు ప్రభుత్వం తమ ధర్మాన్ని పాటించ లేదంటున్నారు మీరు ఏమిచేశారో చెప్పండి.

మంత్రి మాధవమీనన్:- స్వామి సీతారాం ప్రాయోపవేశానికి పూనుకోనున్నామని ముఖ్యమంత్రికి నివేదించడంతోనే, అది ఏరూపంగా పరిణమించగలదో చెప్పలేమనీ, అందువల్ల ఆంధ్రరాష్ట్రం విషయం భారత ప్రభుత్వం విధానమేమో తెప్పవలెనని మద్రాసు ముఖ్యమంత్రి భారత ప్రధానికి లేఖ వ్రాసి ఉన్నారు. స్వామివారు ఇచ్చిన విజ్ఞప్తిలో జంటనే ఆంధ్రరాష్ట్రం నిర్మించే సంకల్పాన్ని భారత ప్రభుత్వం ప్రకటించాలనీ, సరిహద్దు నిర్ణయ సంఘాన్ని సరిహద్దు పరిష్కారానికి నియమించవలెననీ వీలైతే పంచాయితీ, లేకపోతే ప్రజానిర్ణయం ద్వారా వివాదాస్పద విషయాలు తేల్చవలెననీ, పంచాయితీ ద్వారా, వివాదాస్పద విషయాలను పరిష్కరించాలనీ కోరారు. ఈ రాష్ట్రప్రభుత్వం ఈపనులేమీ చెయ్యలేదు. ఈవిషయంలో తాము చెయ్యగల్గినదంతా చేశామనీ, ఇక చెయ్యవలసింది కేంద్ర ప్రభుత్వమేననీ ముఖ్యమంత్రి స్వామీ సీతారాంకు వ్రాశారు. ఇక్కడ ఇదివరకు ప్రకటించబడినలేఖలను ఒకదాన్ని మాధవమీనన్‌గారు చదివారు.

అధ్యక్షులు:- ప్రకటింపబడిన లేఖలు చదవ నవసరంలేదు. క్రొత్తగా ఏమున్నా వుంటే చెప్పండి.

మంత్రి మాధవమీనన్:- స్వామీ సీతారాం ప్రాయోపవేశాన్ని గూర్చి అద్భుతపరిస్థితిని, జిల్లాలోని పరిస్థితిని ఇతరజిల్లాల పరిస్థితినిగూర్చి నివేదికలు ఎప్పటి కప్పుడు కలెక్టర్లనుంచి తెప్పించుచున్నాము. వాటిని వెంట వెంటనే భారత ప్రభుత్వానికి నివేదిస్తున్నాము. అసెంబ్లీలో వచ్చిన అవ్యవధి ప్రశ్న సందర్భాన వచ్చిన ఉప ప్రశ్నలను, సమాధానాలను గూడా ప్రధానికి పంపించినాము. 25 మంది శాసనసభ్యులు ఇచ్చిన తంతినిగూడా భారత ప్రధానికి పంపించాము. దీనికి సమాధానంగా భారత ప్రధాని ఈవిధంగా నేడు మద్రాసు ముఖ్యమంత్రికి వ్రాశారు.

### నెహ్రూ లేఖ

భారత ప్రధాన మంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ ముఖ్యమంత్రికి ఈవిధంగా తంతిఇచ్చారు: "25 మంది మద్రాసు అసెంబ్లీ సభ్యులు స్వామీ సీతారాం ప్రాయోపవేశ సందర్భాన తమ ఆందోళన వెల్లడిస్తూ ఇచ్చిన తంతి నాకు అందినది. వారికినాపక్షాన ఈ సమాధానాన్ని అందచెయ్యండి:

"స్వామి సీతారాం ప్రాయోపవేశ సందర్భాన మీ రిచ్చిన తంతి నాకు అందినది. వారి ప్రాయోపవేశవార్తను నేను అత్యంతఖేదముతో వింటిని. ప్రభుత్వపక్షాన మరీమరీ నేనిచ్చిన హామీలను పురస్కరించుకొని ప్రాయోపవేశాన్ని విరమించవలసిందిగా నేను కోరి ఉన్నాను. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కావాలని మనమంతా అంగీకరించిన విషయమే. ఒకసారి అంగీకరించాక సాధ్యమైనంత త్వరలో అది జరగాలని నేను ఆత్రంతో ఉన్నాను. ఆంధ్రరాష్ట్రం రావడానికి అత్యంత సులభమూ, సత్వరమూ అయిన మార్గాన్ని నేను సూచించియున్నాను. ఆ మార్గాన్ని అనుసరించినట్లయితే సత్వర ఫలితాలు వస్తాయి. ప్రాయోపవేశం ద్వారా పరిపాలన సంబంధమైన ఫలితాలను సాధిద్దామనే యత్నాలకు నేను చాలా విముఖుడనని వీరికందరికీ తెలిసే ఉన్నది. ఈ పద్ధతి మంచిదైనట్లు ఎల్లాఉన్నా, అపసవ్యమైన వత్తిడి తెచ్చిన హానికరం. శాస్త్రీయమైన మామూలు పద్ధతులు ఎన్నో ఉండగా ఈప్రాయోపవేశ సాధనద్వారా కార్యసాధనకు పూనుకోవడం సరియైన పద్ధతిగాదు. ఇందుకు విరుద్ధమైన ప్రయోజనాన్ని సాధించడానికి ఇతరులు ఈ మార్గాన్నే అనుసరించవచ్చు. అప్పుడు ప్రాయోపవేశం ద్వారా వచ్చే అపసవ్య వత్తిడికి ప్రభుత్వం చెయ్యవలసినదేమిటి?

ప్రధాన సమస్యలపైన అంగీకారం లేదన్న ప్పుడూ, మదరాసు నగరంవంటి ప్రధాన సమస్యల పట్ల ప్రధాన వ్యక్తులు, ప్రధాన వర్గాలు, పలుకుబడి గలవారిమధ్య భిన్నాభిప్రాయాలుఉన్నప్పుడు భారత ప్రభుత్వం చర్యతీసుకోవడం అసాధ్యం గాక పోయినా కష్టమైన వ్యవహారం. ద్వేష పూరితమైన తగాదాలను మరింత క్లిష్టం చేసినవారవుతాం.

మా వైఖరి ఏమో మేము స్పష్టంగా చెప్పి ఉన్నాము. అరమర లేకుండా ఒక ఏకగ్రీవమైన ప్రణాళికను అన్వేషించవలసిన భారం ఆంధ్ర నాయకులపై ఉన్నది. ఇందుకు సంబంధించిన ఇతర ఇరుగు పొరుగు నాయకులతో ఒప్పందానికి రావలసిన భారము ఆంధ్రనాయకులపైనే ఉన్నది. ఈ సందర్భంలో భారత ప్రభుత్వం వారి స్పష్టమైన విధానమేమో వెల్లడించే ఉన్నాము.

అట్టిఏడ ప్రధాన విషయాలపై అంగీకారం కుదరకుండా మధ్యవర్తిత్వానికి వదలాలన్నప్పుడు అది తృప్తికరమైన పరిష్కారం కాజాలదు.

అయినప్పటికీ పైవరకు లోబడి పరిష్కారం సాధించగల్గినప్పుడు ఇక వ్యవహారం సులభమై పోతుంది. అవసరమైన చర్యలు తీసుకోవడంలో ఇంకా ఆలస్యమూ ఉండదు. చిక్కూ ఉండదు. ఈ విషయాన్ని గూర్చి శాంతంగానూ, ద్వేష రహితంగానూ మేము ఆలోచించడానికి సహితం వేచివరకుగా ప్రాయోపవేశాన్ని విరమించాలని నేను పునశ్చరణ చేస్తున్నాను. నేను స్నేహపూర్వకంగానూ, హృదయ పూర్వకంగానూ ఇచ్చిన ఈ సలహాను మన్నించి ప్రాయోపవేశాన్ని స్వామివారు, వారి శిష్యులు విరమిస్తారని భావిస్తున్నాను. ఈ సందేశాన్ని స్వామి వారికి పంపించండి."

మంత్రి మాధవమీనన్: స్వామి వారు కోరిన ప్రకారం మేము సందేశాన్ని పంపించాము. కొరనిపని చెయ్యలేదు. మనుష్యయత్నం ప్రకారం మేము చెయ్యదగినదంతా చేశాము. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి మా కెట్టి అభ్యంతరమూ లేదని కేంద్రప్రభుత్వానికి చెప్పి ఉన్నాము, 1950 జనవరి 26 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్రం రావాలనే సంకల్పంతోనే విభజన సంఘ కార్యకలాపాలన్నీ శీఘ్రగతిన ముగించాము. అయినా రాష్ట్రం రాలేదు. అనికి మాది తప్పుగాదు. యీ శాసన సభలోగాని, ఈ ప్రభుత్వంగాని ఇక చెయ్యగలిగింది ఏమీ లేదు. ఈ తీర్మానాన్ని గూర్చి చర్చ అనవసరం.

కూర్తి నారాయణ రావుగారు: మీరు ఏమి చేసినా ఫలితం శూన్యమయింది కాబట్టి ప్రాయోపవేశం జరుగుతూండటం మనమంతా కండ్లారా చూస్తున్నాము. మద్రాసు ముఖ్యమంత్రి స్వయంగా వెళ్ళి స్వామీజీని ప్రాయోపవేశాన్ని విరమించవలెనని నేను సూచిస్తున్నాను. ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా వారిని కోరడం వారు స్వయంగావెళ్ళి బ్రతిమాలడంలేదు. మొదటే నుంచీ ముఖ్యమంత్రి స్వామీ సీతారాం అంటే సానుభూతిని ప్రదర్శిస్తున్నారు ఇది చాలా జరూరు విషయం. గొప్ప దేశభక్తుని ప్రాణాన్ని మనం ఇప్పుడు రక్షించవలసి ఉంది.

అధ్యక్షులు: ఒక్క ముఖ్యమంత్రే గాదు. మనమంతాగూడా వారిని ప్రాయోపవేశాన్ని విరమించవలసిందిగా ప్రార్థించవలసి ఉన్నది.

మంత్రిమాధవమీనన్: ముఖ్యమంత్రి స్వామిసీతారాంకు రెండు జాబులు ఇదివరలో వ్రాసి ఉన్నారు. భారత ప్రధానికి విజ్ఞప్తిని పంపిస్తూ ఒక లేఖ వ్రాశారు.

కూర్తి నారాయణరావు: స్వయముగా వెడితే బాగుంటుందని నా సూచన.

మంత్రి మాధవమీనన్: ఇపుడు భారతప్రధాని ఇచ్చిన తంతికి తోడు మరోజాబు వ్రాస్తూ ప్రాయోపవేశాన్ని విరమించవలసిందిగా మరొక జాబును ముఖ్యమంత్రి వ్రాస్తున్నారు, అంతకన్న మేము చెయ్యగల్గిందిలేదు. ప్రభుత్వంవారు చేసిన పనులనుగూర్చి మంత్రిగారు వివరించినందున తీర్మానాన్ని గూర్చి తాము పట్టుబట్టడం లేదని నారాయణరావుగారు ప్రకటించడంతో ఈ విరామ తీర్మాన ప్రస్తావన ముగిసింది.

### పరిస్థితి ఆశాజనకంగా ఉన్నట్లు స్వామీజీవర్గాల అభిప్రాయం

గుంటూరు, సెప్టెంబరు 7: ఢిల్లీనుండి, డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, కళా వెంకట్రావుగారు, అనంతశయనం అయ్యంగారు, తిరుమలరావుగారు, గాలీబు ప్రభృతి 10మంది పార్లమెంటు సభ్యులున్నూ, విడిగా, అన్నా ప్రగడ కామేశ్వరరావుగారున్నూ స్వామీ సీతారాంకు పంపిన తంతి సందేశాలను బట్టి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో భారత ప్రధాని పండిత నెహ్రూవైఖరి,చాలా సహాయకారిగా ఉన్నట్లు కొద్దిరోజుల్లోనే ఆంధ్రరాష్ట్రనిర్మాణ ప్రయత్నం చాలా ముందడుగు వేయనున్నట్లు తెలుస్తున్నది. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ఆధీనమందున్న ప్రాంతంతో ఆంధ్రరాష్ట్రాన్ని యేర్పాటుచేసేందుకు,నిజలింగప్ప అంగీకరించినట్లు తెలుస్తున్నది. కొమ రాజవాడార్ అభిప్రాయం గూడా కనుక్కొనుటకు ప్రయత్నం జరుగుతున్నది. భారత ప్రధాని పండిత నెహ్రూ, రాష్ట్ర ముఖ్యమంత్రి ద్వారా స్వామీ సీతారాంకు వ్రాసిన లేఖ యింకా యిక్కడికి చేరలేదు. బహుశా యీ లేఖ యివాళ అందవచ్చు.

### దీక్షాపరులలో యిద్దరికి ప్రమాద స్థితి

స్వామీ సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశదీక్ష పూని యివాళటికి 28 వ రోజు. వీరంతా చాలా నీరసించినట్లు కన్పిస్తున్నారు. మొన్న ఆస్పత్రిలో చేర్పిన, సంపత్కుమార్ గారి ఆరోగ్యం కొంత చక్కబడినా బసవయ్యగారి పరిస్థితి ఇంకా అందోళనకరంగానే ఉన్నది. దుర్గాంబగారి పరిస్థితి చాలా ప్రమాదకరంగా ఉన్నదని డా॥ చలపతిరావుగా రన్నారు.

### స్వామీ సీతారాం ప్రకటన

రాష్ట్రనిర్మాణం విషయంలో ఆంధ్రనాయకుల మధ్య అనైక్యతే ప్రబల ఆటంకంగా ఉన్నదన్న విషయంగురించి చెబుతూ స్వామి సీతారాంగారు, యీ అనైక్యతా ప్రచారమంతా వట్టి బూటకమని అన్నారు.

"కొన్ని ముఖ్య విషయాలపై ఆంధ్ర నాయకులలో, నిష్కల్మషమైన అభిప్రాయ భేదాలుంటే ఉండవచ్చు. తన అభిప్రాయమే సక్రమమైనదని, అభ్యుదయానికి దోహదం కాగలదని ఎవరికి వారు, భావిస్తూ ఉండవచ్చు." అని స్వామీ అన్నారు.

"నాయకులు నిర్లక్ష్యంగా ఉండేట్లయితే, యీ ఉద్యమంలో ముందుకు సాగిపోతూండదని స్వామీ సీతారాం ప్రజలకు విజ్ఞప్తిచేశారు. ప్రముఖఆంధ్ర నాయకులు, ప్రాయోపవేశం విరమించవలసిందిగా స్వామీ సీతారాంకు విజ్ఞప్తులు చేసినప్పటికీన్నీ, ప్రధాన మంత్రి నెహ్రూవైఖరి అనుకూలంగా ఉన్నట్లు వినవస్తున్నప్పటికీ, యింతలో స్వామీజీ వైఖరిలో మార్పేమీ ఉండబోదని, తెలుస్తున్నది.

రాష్ట్రనిర్మాణం విషయంలో కేంద్రప్రభుత్వ ప్రకటనకోసం స్వామీ సీతారాం నిరీక్షిస్తున్నారు. రేపు 9 వ తేదీన రాష్ట్ర దీక్షాదినంజరుపుటకు తగు సన్నాహాలు చేసేందుకై ఒక కార్యాచరణసంఘం యేర్పాటు చెయ్యబడింది.

అఖిలపత్మ మహాసభ అధ్యక్షుడు ఉన్నవ లక్ష్మీ నారాయణగారు, ఆనాడు ఆంధ్రప్రజలంతా హర్తాళులు, ఊరేగింపులు బహిరంగసభలు జరిపి, భారత ప్రధానమంత్రికి తంతిద్వారా తెలుపవలసిందిగా, విజ్ఞప్తిచేస్తున్నారు. వినయాశ్రమంలో రోజూ 10 మంది సానుభూతి సూచకంగా ఉపవాసం చేస్తున్నారు.

### రాష్ట్ర ప్రతికూలవాదుల సంకల్పం

మద్రాసు, సెప్టెంబరు 7: స్వామీ సీతారాం ప్రాయోపవేశ ఫలితంగా ఆంధ్రరాష్ట్రాన్ని ఇవ్వదలచినట్లయితే, రాష్ట్రం కూడదని తామూ నిరాహార దీక్షకు ఉపక్రమిస్తామని హొయలసీను మహాసభకు చెందినవారు కొందరు రాష్ట్ర ప్రభుత్వానికి, భారత ప్రభుత్వానికి వర్తమానాలు పంపినట్లు తెలుస్తున్నది.

న్యూఢిల్లీ సెప్టెంబరు 7: ఆహార ధాన్యాల ధరలు పెరిగిన కారణంగా కేంద్రం ఇచ్చే ఆహార సబ్సిడీల బడ్జెట్టు మిగులులో 50 పర్సెంటు మొత్తాన్ని తినివేస్తుందని ఆర్థిక మంత్రి శ్రీ దేశముఖ్ అన్నారు.

## కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుల రాజీనామా

(1 వ పేజీ తరువాయి)

పక్షాలకు సమ్మతిమైన ముసాయిదా తీర్మానం ఒకటి ఏ. ఐ. సి. సి. ముందు కార్యవర్గమే వుంచుతుంది. లేకపోతే, కార్యవర్గాన్ని పండిట్ నెహ్రూ అభిమతానుసారం పునర్నిర్మించవలసిందని ఏ. ఐ. సి. సి. టాండనుకు ఆదేశించవచ్చునని కొంతమంది అభిప్రాయం. ఇదివరకు త్రిపురా సమావేశంలో సుభాస్ చంద్రబోస్‌కు సరిగా ఇలాగే జరిగింది. గాంధీజీకి సమ్మతినయ్యే విధంగా కార్యవర్గాన్ని నిర్మించవలసిందని విషయ నిర్ణయసంఘం ఆ సమావేశంలో ఒక తీర్మానంచేసిన విషయం పాఠకులకు జ్ఞాపకం ఉండవచ్చు.

టాండన్ ఒకవేళ దానికి అంగీకరించక రాజీనామా ఇస్తే, ఏ. ఐ. సి. సి. టాండన్ స్థానే పండిట్ నెహ్రూను అధ్యక్షపదవికి ఎన్నుకుంటుందని అంతా అనుకుంటున్నారు.

నేటి కార్యవర్గ సమావేశానంతరం, కళా వెంకట్రావుగారు పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ, కార్యవర్గ సభ్యులు పరస్పరం సంప్రతింపులు జరుపుకొన్నారు. గాని ఇంకా ఒక పరిష్కారమార్గం అంటూ కుదరలేదని చెప్పారు. అండమాన్‌దీవులలో కాంగ్రెసు కమిటీని ఏర్పాటు చేయడానికి అనుమతించవలసిందంటూ కొందరు దరఖాస్తు చేశారనీ, కాని అండమాన్లలో స్థిరనివాసంగా ఉంటున్న వారివద్దనుంచి దరఖాస్తులు వచ్చినప్పుడు ఈ సంగతి చూడవచ్చునని కమిటీ ఆవిషయమై నిర్ణయాన్ని వాయిదా వేసిందనీ, వెంకట్రావుగారుచెప్పారు.

కేంద్ర ఎన్నికల ట్రిబ్యునల్ చేసిన కొన్ని సూచనలనుగూడా కమిటీ పరిశీలించింది. ట్రిబ్యునల్ చేస్తున్న కృషికి కార్యవర్గం కృతజ్ఞత వెలిబుచ్చింది.

కాంగ్రెసు అధ్యక్షుడు టాండన్ కాంగ్రెసులో వచ్చిన పరిణామాలను గురించి ఈ వేళ రాత్రి పత్రికా విలేఖరుల యెదుట ఒక ప్రకటన చేస్తాడని ఏ. ఐ. సి. సి. ఆఫీసువారు చెప్పటంవల్ల, పత్రికా విలేఖరులంతా నిర్ణీత సమయానికి ఏ. ఐ. సి. సి. ఆఫీసుకు వెళ్ళి అధ్యక్షుడికోసం నిరీక్షిస్తూ కూర్చున్నారు. తన మౌనవ్రతం విడిచిపెట్టి టాండన్ ఇవాళ ఏదో గొప్ప ప్రకటన చేస్తాడని అంతా ఆశపడ్డారు, కాని గంటన్నరసేపు అయిన తర్వాత ఆయన ఇవాళ ఏమీ మాట్లాడదలచుకోలేదని జనరల్ సెక్రటరీ చల్లగా కబురు తెచ్చి, భారతీయ సంస్కృతిగురించి టాండన్ గారు చేసిన ఒక ప్రకటన ప్రతులను మాత్రం పత్రికా విలేఖరులకు పంచిపెట్టారు. దీనికి పత్రికా విలేఖరులు అధిక్షేపణ సూచకంగా ఆయన ఇచ్చిన ఆ ప్రతులన్నీ అక్కడే పడేసి బైటికి వెళ్లిపోయారు.

కార్యవర్గం నేటి సాయంత్రం సమావేశమై, నెహ్రూ రాజీనామావల్ల కాంగ్రెసులో ఏర్పడిన విషమపరిస్థితి గురించి 3 గం॥లసేపు చర్చించింది, కాని చర్చలు ఇంకా ఎటూ తెగలేదు కార్యవర్గం రేపు ప్రొద్దున మళ్ళీ సమావేశం అవుతుంది. కార్యవర్గ సభ్యులు 19 మందిలోను నేటి సమావేశానికి 16 మంది హాజరైనారు. ప్రత్యేకాహ్వానం మీద, డా॥బి. సి. రాయ్, మొరార్జీదేశాయ్, డా॥ పట్టాభి సీతారామయ్యగారలు వచ్చారు.

### విషమావస్థ తొలగి పోతుందని జుగుల్‌కిశోర్ విశ్వాసం

లక్నో, సెప్టెంబరు 6: కాంగ్రెసులో ఏర్పడిన సంకట పరిస్థితి తప్పక పరిష్కారం కాగలదని తాను విశ్వసిస్తున్నాననీ, పురుషోత్తమదాస్ టాండన్ గారు వ్యవహార సౌలభ్యం కోసం ముందు రాజీనామా ఇచ్చినా, ఏ. ఐ. సి. సి. తర్వాత దానిని ఉపసంహరింపచేయవచ్చుననీ, యు. పి. సి. సి. అధ్యక్షుడు ఆచార్య జుగుల్ కిశోర్ గారు ఈ వేళ న్యూఢిల్లీకి బయలుదేరే ముందు ఒక ప్రకటన చేశారు.

## జపాన్ ఒడంబడిక: ఈజిప్టు ప్రతినిధివిమర్శ

(1-వ పేజీ తరువాయి)

ఆయన నొక్కిచెప్పారు.

నార్వే, దక్షిణాఫ్రికా, బెల్జియమ్ ప్రతినిధులు శాంతి సంధిపై సంతకాలు చేయనున్నట్లు ప్రకటించారు. శాంతి సంధిలోని ఆర్థిక నిబంధనలవల్ల జపానుతో వాణిజ్యంలో చిన్న దేశాలకు సమానమైన సౌకర్యాలు లభించకపోవచ్చుననే అనుమానాన్ని బెల్జియమ్ ప్రతినిధి వెలిబుచ్చారు.

సింహళ ప్రతినిధి తన ప్రసంగంలో నిన్న సోవియట్ ప్రతిపాదించిన సవరణలను ప్రతిఘటించారు.

లండన్, సెప్టెంబరు 6: బ్రిటిషు విదేశాంగమంత్రి హెర్బర్ట్ మారిసన్ నేటిరాత్రి విమానంలో ఇక్కడినుండి శాన్‌ఫ్రాన్సిస్కోకు బయలుదేరారు. ఆయన బ్రిటన్ తరఫున జపాన్ శాంతి సంధిపై సంతకం చేస్తారు.

## చీరాల స్టేషన్‌లో గుడ్సుబండికిప్రమాదం

### ఎక్స్‌ప్రెస్ మొదలగు అనేక రైళ్లకు ఆటంకం

(స్వకీయ విలేఖరి)

చీరాల, సెప్టెంబరు 6: ఈ రైల్వే స్టేషన్ ఆవరణలో ఉత్తరపుకొననున్న కాబిన్ వద్ద మెయిన్ లైనుపై యీ ఉదయం 7-30 గం॥ల వేళ షంటింగ్ చేస్తున్న సందర్భంలో నెం 417 డౌన్ గుడ్సుబండి తాలూకు రెండు వాగన్ల చక్రాలు పట్టాలు తప్పినవి. గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్, 4 అప్ ప్యాసెంజర్ బండి, 10 అప్, 33 డౌన్, యీ రైళ్లన్నీ ప్రక్క స్టేషన్లలో గంటల తరబడి నిలచిపోవలసి వచ్చింది. ఈ సంఘటనను గురించి స్టేషన్ మాష్టర్ సయ్యాద్ అహమ్మద్, రైల్వే అధికారులకు తెలియజేశారు. బ్రేక్ డౌన్ స్పెషల్ బండి ఒక క్రేన్‌తోనూ, ఇంజనీరింగ్ సిబ్బందితోనూ 11-40 గం॥లకు యిక్కడకు చేరింది. బెజవాడ నుండి ట్రాఫిక్ ఇన్‌స్పెక్టరుగారు గూడా వచ్చారు. గంట సేపటిలో, వాగన్లను పట్టాలపై ఎక్కించి మార్గాన్ని నిరాటంకం చేశారు.

12-40 గం॥లకు యథా ప్రకారం రాకపోకలు ప్రారంభమైనాయి. ఈ ప్రమాద కారణం గురించి యీ రైల్వే స్టేషన్‌లో డిపార్ట్‌మెంటల్ దర్యాప్తు సాగుతున్నది. ఈ ప్రమాదంలో ఆస్తి నష్టం, ప్రాణనష్టం యేమీ లేదు.

# కంపెనీల చట్ట సేకరణ బిల్లు

## పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: ఇండియన్ కంపెనీల (సవరణ) బిల్లును పార్లమెంటు ఒక విధంగా ఆమోదాన్ని తెలియ జేసింది. సభ్యులకు బిల్లులోని అంశాలు చాలావరకు నచ్చాయి.

కంపెనీల వ్యవహారంలో మేనేజింగు ఏజన్సీల పద్ధతిని సంస్కరించడానికి ఈబిల్లు ఉద్దేశించబడింది. మేనేజింగు ఏజన్సీలలో అక్రమ వ్యాపారాన్ని, వాటాల గుత్తకొను గోళ్లను అరికట్టడానికి ఈబిల్లు ఉద్దేశింపబడింది.

ఈబిల్లులో సెలెక్టు కమిటీవారు చేసిన మార్పులనుగూర్చి ప్రసంగిస్తూ, ఆ మార్పులవల్ల ఈబిల్లు చాలా బాగుపడిందని ఆర్థికమంత్రి దేశముఖ్ అన్నారు. అదీకాక ఈబిల్లు ఏదో తాత్కాలికమైన ఏర్పాటు వంటిదేగాని సమగ్రమైన శాసనం వంటిదికాదు. కంపెనీలా కమిటీవారి నివేదిక అందిన అనంతరం కంపెనీ వ్యవహారాలనుగూర్చి సమగ్రమైన బిల్లును ప్రభుత్వం ప్రతిపాదిస్తుంది అని ఆయన అన్నారు.

ఇక ఇప్పుడు తాను ప్రతిపాదిస్తున్న ఈబిల్లు యొక్క ప్రయోజనాన్ని గూర్చి ఆయన ఈవిధంగా వివరించారు: సచ్ఛీలురైన మేనేజింగు ఏజంట్లను ఇది రక్షిస్తుంది. అట్టివారు కాని వారు ఎవరైనవుంటే, వారిని బయటకు లాగి గట్టిగా బుద్ధిచెప్పేందుకు ఇది తోడ్పడుతుంది.

సభ్యులలో శ్రీ రంగాగారు మేనేజింగు ఏజన్సీ పద్ధతిని పూర్తిగా రద్దు చేసిపారవేయడం మంచిదని వాదించారు. కొంతమంది ఆ పద్ధతిలో లోపాలు వున్నప్పటికీ, దేశంయొక్క పారిశ్రామికాభివృద్ధికి అదేచాలావరకు కారణం అయి వుండటాన్ని గుర్తించాలని వాదించారు.

శ్రీ రామనాథ గోయెంకా మాట్లాడుతూ మేనేజింగు ఏజంట్లు మంచివారైతే, వారు దీనిని చూచి భయపడవలసిందేమీ లేదన్నారు.

సెప్టెంబరు 7వ తేదీవాడు ఈబిల్లు మీద అంశంవారీ చర్చలు ప్రారంభం అవుతాయి.

ఈ బిల్లుమీద ఈచర్చకు పూర్వం పార్లమెంటు రెండు కంపెనీల బిల్లును ఆమోదించింది. ఇవ్వాళటి పార్లమెంటు కార్యక్రమాన్ని అష్ఘన్ ప్రధాని పరిశీలించారు.

# సింధుప్రధాని బర్తరఫుకు గవర్నరుకు మహజరు

## ఖూరోపై అవినీతి ఆరోపణ

కరాచీ, సెప్టెంబరు 4: అవినీతికిన్నీ, చేతకాని పరిపాలనకున్నూ సింధు ప్రధానిని బర్తరఫ్ చేయవలసిందిగా కోరుతూ 6 మంది శాసనసభ్యులు పెట్టుకొన్న ఒక మహజరు నేడు సింధు గవర్నరుకు అందింది.

మహజరుదార్లు ప్రధాని ఖూరోపైన 60 నేరాలు మోపారు. ఆ దుర్నడత చర్యలను విచారించడానికి ఒక విచారణసంఘాన్ని నియమించాలని వారు కోరారు. ఆ విచారణ ఫలితం తేలేదాకా ఆయనను బర్తరఫ్ చేయాలని వారు విన్నవించారు.

# మదరాసు కౌన్సిలు

## ఎస్టేటు డ్యూటీ తీర్మానం ఉపసంహరణ

మద్రాసు, సెప్టెంబరు 6: మద్రాస్ కౌన్సిలు యీవాళ శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి అధ్యక్షతను సమావేశమైంది. ప్రశ్నోత్తరముల తరువాత రివిన్యూమంత్రి శ్రీ హెచ్. సీతారామ రెడ్డిగారు వ్యవసాయభూములపై ఎస్టేటు డ్యూటిని విధించే శాసనానికి సంబంధించిన తీర్మానమును, కౌన్సిలు సభవారు గావించిన విమర్శలను పురస్కరించుకొని మదరాసు ప్రభుత్వం ఉపసంహరించుకోదలచినదని తెలుపుతూ తీర్మాన ఉపసంహారణకు సభవారి అనుమతి కోరారు. సభవారందుకు అంగీకారం తెలిపారు.

ఆ తరువాత వ్యవసాయమంత్రి శ్రీ వి. వి. శెట్టిగారు తూనికల కొలమానముల చట్టసవరణ బిల్లును ప్రతిపాదిస్తూ ఉప్పు చిల్లరగా అమ్మినపుడు వర్తకులు కొలతపద్ధతిగాక తూనికపద్ధతి అవలంబింప చేయుట బిల్లు ఉద్దేశ్యమన్నారు. ఎట్టిచర్చ లేకుండా బిల్లు శాసనంగా ఆమోదింపబడ్డది.

తరువాత ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు ప్రతిపాదించిన పెట్రోలు పన్ను సవరణబిల్లును కూడా సభవారు యేవిధమైన చర్చ లేకుండా ఆమోదించారు.

### జీతాలబిల్లు ఆమోదం

ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు మంత్రులు శాసనసభాధ్యక్షులు మున్నగు ఉద్యోగుల జీతాలబిల్లును ప్రతిపాదిస్తూ వెనుక 1946 లో గావించిన బిల్లు 1950 జనవరి 26 తో రద్దయిపోయినదని అప్పటినుండి పెద్దోద్యోగులు అధికారబలంవల్ల యిప్పుడు పై ఉద్యోగులకు జీతాలు యివ్వబడుతున్నవని యీ విషయంలో శాసనసభవారు తిరిగి క్రొత్తగా శాసనం చేయుట అవసరమై యున్నదని చెప్పారు. అవసరమని తోచిన కొద్ది మార్పులతో పాతశాసనమే యీ బిల్లు రూపమున ప్రతిపాదింపబడిందని తెలిపారు.

శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు బిల్లును బలపరుస్తూ కౌన్సిలు అధ్యక్షునికి స్పీకరుకు సమానహోదా కలుగచేయటానికి వెనుక యీబిల్లు శాసనమైనపుడు కౌన్సిలు సభ్యులు శ్రద్ధవహించి సాధించగల్గిన సంగతి జ్ఞప్తికి తెచ్చారు.

ఈబిల్లుకూడా చర్చ లేకుండా సభవారిచే ఆమోదింపబడింది.

### ఇండ్ల అద్దెలకంట్రోలు చట్టం సవరణ బిల్లు

పై బిల్లు మంత్రి మాధవమీనన్‌గారు ప్రతిపాదిస్తూ ఇండ్ల అద్దెల కంట్రోలు చట్టపు జీవితకాలం మరి రెండేళ్లు జరపు పొడిగించుటకు యీ సవరణ బిల్లు తేబడినదని తెలిపారు.

శ్రీ సూర్యనారాయణ, శ్రీ ఆదిత్యన్, డా॥ శాస్త్రీజీ గార్లు ఇండ్ల కొరతవల్ల ప్రజలకు కలిగిన వత్తిడిని తొలగించుటకు ప్రభుత్వము ఎట్టిచర్యలు గైకొన్నదని ప్రశ్నించారు.

మంత్రి మాధవమీనన్ గారు విమర్శలకు సమాధానమిస్తూ ఇల్లా చెప్పారు: ప్రభుత్వంవారు రాష్ట్రమంతటా గృహనిర్మాణ సహకార సంఘాలను ఏర్పరచి గృహనిర్మాణ కార్యము సాఫల్యమైనంతవరకు సాగిస్తున్నారు. గాంధినగరులో ఇపుడు దాదాపు 500 ఇండ్లు, సైనాయి నగరులో 2, 3 వందల ఇండ్లు నిర్మించబడి యున్నవి. ఐనావరంలో మధ్యతరగతివారికి తగిన గృహములు నిర్మించటానికి స్కీము అమలు జరుగుతోంది. సహకార సంస్థలేగాక ప్రైవేటు వ్యక్తులు కూడా గృహనిర్మాణములకు పూనుచున్నారు.

ఆపైన బిల్లు క్లాజువారిగా ఆమోదింపబడింది.

అనంతరం ఆహారమంత్రి కోషు విక్టోరియా గారు ప్రతిపాదించిన అవసరపదార్థాల కంట్రోలు సేకరణ బిల్లు ఆర్థిక మంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు ప్రతిపాదించిన కల్లుమందు చట్ట సవరణ బిల్లు లా శాఖ మంత్రి శ్రీ మాధవమీనన్ గారు మదరాస్ టౌను న్యూసెన్సు చట్టం పురుకొల్పుటకు వర్తింపచేసే సవరణ బిల్లులు చర్చ లేకుండా ఆమోదింపబడ్డవి.

అనంతరం మదరాసు ఓషధుల కంట్రోలు సవరణబిల్లు 1951 సభవారిచే ఆమోదింపబడింది.

### ఆంధ్రయూనివర్సిటీ సవరణ బిల్లుకు (1951) ఆమోదం

మంత్రి మాధవమీనన్ గారు ఆంధ్ర యూనివర్సిటీ సవరణబిల్లు (1951) ప్రతిపాదించారు. విశాఖజిల్లా, శ్రీకాకుళం, విశాఖజిల్లాల క్రింద రెండుగా విభజింపబడిన కారణమున ఆ రెండు జిల్లాలకు యూనివర్సిటీలో ప్రాతినిధ్యం యిచ్చుటకును, జమీందారీ రద్దుశాసనంవల్ల భూస్వాముల నియోజకవర్గము రద్దయిపోయి యున్నందుచేత, వారిస్థానాలను శాసనసభ ద్వారా భర్తీ చేయుటకును సవరణ బిల్లు అవకాశం నొసగుచున్నదని బిల్లు ఉద్దేశ్యములను వివరించారు.

పైబిల్లుకు సభవారు చర్చ లేకుండా క్లాజువారిగా ఆమోదించి శాసనంగా అంగీకరించారు.

### అభివృద్ధిపన్ను విధింపు బిల్లు

మదరాసు, సెప్టెంబరు 6: నేడు కవున్సిల్లో మదరాసు ఇరిగేషన్ అభివృద్ధిపన్ను బిల్లు పరిశీలనకు జాయింటు సెలెక్టుకమిటీ నియామక ప్రతిపాదన వచ్చినప్పుడు శ్రీ ఆర్. సూర్యనారాయణగారు ద్రవ్యబిల్లుల విషయమై స్పీకరు రూలింగ్ ననుసరించి ఇప్పుడు మంత్రిగారు చేయబోయే ప్రతిపాదన వల్ల లాభమేమీ వుండదనియు, అసెంబ్లీ ప్యాసుచేసిన తరువాతనే చర్చకు తీసుకుంటే మంచిదన్నారు.

నారాయణమీనన్: ఈ బిల్లును కూడా స్పీకరు ద్రవ్యబిల్లు అని వ్యవహర్చారా?

న్యాయమంత్రి: స్పీకరురూలింగ్, రూలింగ్‌కు పూర్వ విషయాలకువర్తించదు. ఈబిల్లు ద్రవ్యబిల్లు అవునా కాదా అనేదిసంశయాస్పదంగావుంది. ఇది పన్ను కాదు. ఫీజుమాత్రమే.

అధ్యక్షుడు: ద్రవ్యబిల్లు అవునా కాదా అని నిర్ణయించేది స్పీకరు.

న్యాయమంత్రి: ఈబిల్లు విషయమై ఇంతవరకు ఏవిూ ఆక్షేపణలేదు.

తరువాత రివిన్యూమంత్రి మదరాసు ఇరిగేషన్ అభివృద్ధిపన్ను బిల్లు పరిశీలనకు 21 మంది సభ్యులు (14 గురు అసెంబ్లీ నుండి 7 గురు కవున్సిల్ నుండి)గలజాయింటు సెలెక్టుకమిటీపరిశీలనకు పంపుటకు ఆమోద మివ్వాలని ప్రతిపాదించారు.

అధికోత్పత్తి కార్యక్రమను ప్రారంభమైన తరువాత ప్రభుత్వం అనేక అభివృద్ధి పనులను నిర్వహించింది. తత్ఫలితంగా భూముల విలువ పెరిగింది. అట్టి పెరుగుదలలో కొంత ఫీజుక్రింద వసూలుచేసి ఇతరచోట్ల అభివృద్ధిచేయుట ప్రభుత్వమువారి ఉద్దేశ్యమని బిల్లును ప్రతిపాదిస్తూ రివిన్యూ మంత్రి చెప్పారు. ఇంప్రూవ్‌మెంటు ఫీజుకూడా వసూలు చేయుటకు యీ బిల్లు ఉద్దేశిస్తూ వుందన్నారు.

శ్రీ ఆర్. సూర్యనారాయణ: ఎప్పుడో తయారైన ఈ బిల్లును అమలు జరుపకుండా ఇప్పుడు ఎందుకు అమలు జరుపవలసి వచ్చిందో మంత్రిగారు తృప్తికరమైన సమాధానం ఇవ్వలేకపోయారు. వెనుకబడిన ప్రాంతాల్లో పనులు ప్రారంభించే టప్పటికే యీ ఉద్దేశ్యం యెందుకు రావాలి? నీటి సదుపాయాలు ఇదివరకులేని ప్రాంతాలలో క్రొత్తగా ఈ పనులు సాగించి అక్కడి భూములు వాటివల్ల నిజంగా లాభం పొందకపోయినప్పటికీ అభివృద్ధి పన్ను వేయ సెంచడం సబబుకాదన్నారు. బిల్లు ఆచరణలో చాలా చిక్కులు యుండగలవని అన్నారు.

శ్రీ కుమారస్వామి మొదలార్యరుగారు వ్యవసాయ భూములపై అభివృద్ధి పన్నును ఆక్షేపిస్తూ తీర్మానమును యెదిరించారు. ఇదివరకే పన్ను భారం వల్ల క్రుంగుతున్న రైతులమీద యీ క్రొత్తభారమును విధించడం ఏ మాత్రం న్యాయంగా లేదన్నారు.

అంతటితో సభవారు ఫలహారమునకు లేచారు.

### గురువారం మధ్యాహ్నం చర్చ

గురువారం మధ్యాహ్నం కౌన్సిలు వారు సమావేశమైనపుడు ఎం. నారాయణ మీనన్ గారు అభివృద్ధి పన్ను బిల్లును తీవ్రంగా విమర్శించారు. కే. నటరాజన్ గారు ఈ బిల్లు యిప్పుడు రావడం అప్రస్తుతమనీ, అనవసరమనీ, అయుక్తమనీ అన్నారు. కాంగ్రెసు ప్రభుత్వ పరిపాలన పన్నుల పరిపాలనగా వర్ణించవచ్చునన్నారు. డా॥ వరదరాజులునాయుడుగారు, ప్రభుత్వ బిల్లుకు అసమ్మతి తెలిపారు.

శ్రీ ఆర్మకూరి గోవిందాచారిగారు మాట్లాడుతూ ఈ పన్నులతో ఓటర్ల దగ్గరకు వెడితే వెనుక ఉప్పు పన్నును బలపరచిన శ్రీ మోచర్ల రామచంద్రరావు, ఇన్‌ఫ్లూయెన్జాను సమర్థించిన సర్ కే. వి. రెడ్డినాయుడుగారికి పట్టినగతి పట్టక తప్పదన్నారు. అంతటి సమర్థ రాజకీయ వేత్తలే తిరిగి ఎన్నిక అవలేకపోయారు. రాజకీయాలనుండి విరమించవలసి వచ్చింది. క్రొత్తపన్నులు వేయుటకు ఇది తరుణం కాదన్నారు.

జనాబ్ ఫరూకీసాహెబ్ ఎస్టేటు డ్యూటీ తీర్మానమును ఉపసంహరించుకున్నట్లుగా ప్రభుత్వం ఈ బిల్లును కూడా విరమించుకుంటే మంచిదన్నారు.

శ్రీ జయరామరెడ్డిగారు బిల్లును బలపరచి అందులో కొన్ని సవరణలు అవసరమన్నారు. శ్రీ మోతే నారాయణరావుగారు బిల్లును ఎదిరిస్తూ యీ పన్ను విధించటానికి ఇది తరుణంకాదని దానిని ప్రస్తుతానికి వాయిదా వేయవలసిందని కోరారు.

ఇబ్రహీముగారు అభివృద్ధిపన్ను విధింపు గతానికి వర్తింపచేయడం ఆక్షేపించారు. ఇరిగేషను స్కీములవల్ల వృద్ధిఅయిన భూములు ఒకరినుండి మరొకరిచేతికి మారినపుడు యీ అభివృద్ధిపన్ను ప్రభుత్వం ఎవరినుండి వసూలు చేస్తుందని ప్రశ్నించారు.

### రివిన్యూమంత్రి జవాబు

రివిన్యూమంత్రి పాలకొర్తి శ్రీ సీతారామరెడ్డిగారు విమర్శలకు సమాధానమొసగుతూ యిల్లా చెప్పారు. బిల్లును ఎదిరించిన సభ్యులు బిల్లులో లేని విషయాలనుగూర్చి చాలావరకు విమర్శ చేసినారు. ప్రభుత్వంవారు యే స్థలంలోనైనా యిరిగేషను పనులు జరిపే స్కీములను యిటీవల తలపెట్టినపుడు ఆ స్కీములవల్ల ప్రయోజనం పొందే భూముల యజమానులు వారి లాభాలకు తగినట్టుగా ప్రభుత్వానికి భాగం యివ్వవలసి యుంటుందని అభిప్రాయం తెలుపుతూనే యున్నారు.

శ్రీ సూర్యనారాయణ గారు:— తుంగభద్ర ప్రాజెక్టు ప్రారంభించటానికి ముందు అట్టి ప్రకటనఏమైనా ప్రభుత్వం చేసిందా?

మంత్రి సీతారామరెడ్డిగారు: ఇటీవల తలపెట్టిన స్కీముల విషయంలో అట్టి ప్రకటనలు చేస్తున్నది. ప్రభుత్వము వారు ప్రజలకు కావలసిన నీటి వనరుల సదుపాయాలను అభివృద్ధి పరచి వారిస్థితిని పెంపొందించుటకే ఈ స్కీములను తలపెట్టుతున్నారు. అట్టి పనుల మూలమున వృద్ధిఅయ్యే భూములు తమనులభించిన లాభంలో ప్రభుత్వానికి కొంతపన్ను ఇవ్వాలని కోరడం న్యాయమేయగును. ఈ క్రొత్త పన్నులలో ప్రభుత్వము యితర స్కీములను నిర్వహించటానికి వీలగును. అందువల్ల భూస్వాములు యీ పన్ను నొసగటానికి వెనుదీయరాదు. కాంగ్రెసు ప్రభుత్వ పరిపాలన పన్నుల పరిపాలన అని కొందరు విమర్శించారు. స్వతంత్రదేశాలస్థితి విచారిస్తే పంగతి బోధపడ గలదు. అందులో నే బ్రిటిషురాజ్యంలో ప్రజలు చెయ్యవలసిన త్యాగం అపూర్వంగా వున్నది. ఇతరదేశాల చరిత్రచూస్తే ఆ సంగతి మరీ బాగా తెలియగలదు. పన్నుల పరిపాలన అని అంటే నేనుసిగ్గు పడటం లేదు. కాంగ్రెసు ప్రభుత్వంసిగ్గు పడవలసిన పనిలేదు. ఆ పన్నులన్నీ ప్రజాక్షేమానికి వినియోగింపబడే నప్పుడు, ప్రజాశ్రేయస్సుకు వెచ్చించినప్పుడు అందు గర్వపడవలసినదే గాని విచారించవలసిన పనిలేదు. ఎస్టేట్లు రద్దయినచోట యీ బిల్లువర్తిస్తుంది. లేనిచోట వర్తించదు. సెలెక్టు కమిటీకి అభివృద్ధిపన్ను బిల్లును పంపవలెనన్న ప్రతిపాదన ఓటుకుపెట్టగా అనుకూలంగా 12 గురు ప్రతికూలంగా 9 మంది ఓటుచేశారు. కాంగ్రెసు సభ్యుడు శ్రీ. నటరాజన్ గారు వ్యతిరేకంగా ఓటుచేశారు. కాంగ్రెసు సభ్యులు శ్రీ క్రిస్ప్, శ్రీ నారాయణమీనన్, డా॥ వరదరాజులునాయుడు మోతే నారాయణరావుగారలు నల్గురు తటస్థంగా వుండిరి. ప్రభుత్వ ప్రతిపాదనను సభవారు అంగీకరించారు.

# గ్రామాలలో పరపతి సౌకర్యాల పరిశీలన

## రిజర్వుబ్యాంకు ఉపసంఘం: దేశముఖ్ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: భారత దేశమంతటా గ్రామపరపతి విషయమై సమగ్రంగా పరిశీలించడానికి భారత రిజర్వుబ్యాంకువారు ఒక ఉపసంఘాన్ని యేర్పరిచారని ఆర్థికశాఖామంత్రి శ్రీ దేశముఖ్ గారు ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ నేడు పార్లమెంటులో వెల్లడించారు. యీ సంఘానికి శ్రీ గోర్వాలాగారు అధ్యక్షులు.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 7.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటకు వరకు 1-8 ఎక్స్ఛేంజిబొమ్మ పేటులతోవచ్చు రు. 78-6.0 పెట్లాంబంగారు తులం 113-14.0 మూనబంగారు 111.4.0 పీసువెండి తులం 100.8 (కడి) 191.0.0 వెండి తులం 1-8 2.0.0.

వేరుశెనగ: (531 వీ 1-8 ఎక్స్‌పోర్టు గిడ్డంగుల మెషీన్ పేట్లూటుతో వచ్చు)

| | |
|---|---|
| కడి | రు. 180, 183 |
| వేరుశనగనూనె ఎక్స్‌పెల్లర్ లిలో 3% | |
| క్యాండీ (500 వీ.) | రు. 348-350 |
| పెంగాయ నూనె (37½ పౌనుల గల డబ్బా) | |
| ఒకటి— | |
| క్వాలిటి | రు. 39-14.9 |
| కార్‌కట్ యస్. బ్రాండ్ | 40.0-9 |

ఆముదం

| | |
|---|---|
| 500 వీసులు గల వారుపు ఒకటికి | |
| "తిరుపత్తూరు" | రు. 420.0.0 |
| "నకపారాం పేట" | రు. 430-0-0 |

వంపదార

| | |
|---|---|
| ప్యారీ | 102-0-1 |
| మోతీహారి | రు. 103-12-1 |











Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras.